# పరమానందయతీంద్ర

# శివముకుందశతకము

చెన్నపురి, 1922

Record no. 666

Paramānandayatīndra

Śivamukundaśatakamu

Cennapuri, 1922

Record no. 666

## Bibliographic Record Target

పరమానందయతీంద్ర.

శివముకుందశతకము / పరమానందయతీంద్ర విరచితము.- చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1922.

25, 7 p. ;16 cm.

Record no. 666

Paramānandayatīndra.

Śivamukundaśatakamu / Paramānandayatīndra viracitamu.- Cennapuri : Vāviḷḷa Rāmasvāmiśāstrulu amḍ Sans, 1922.

25, 7 p. ;16 cm.

Record no. 666

శ్రీరస్తు.

# శివముకుందశతకము.

పరమానందయతీంద్ర విరచితము.





చెన్నపురి:
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.
1923.

Printed by
V. RAMASWAMY SASTRULU & SONS
at the "VAVILLA" PRESS,
MADRAS—1922.

శ్రీరస్తు.

# శివముకుందశతకము.




వరగిరిజానాయక
గోవింద లలాటనేత్ర గోకులతిలకా
భావజసంహార హరిహార
భావాత్మక శివముకుందపరమానందా.

క. దైవము లిద్దఱు నేకో
దేవాది శ్రుతులవల్ల దెలియఁగ నొకటే
భావించెద మిము నేకీ
భావంబుగ శివ.... 2

క. భక్తులపరిపక్వములకు
వ్యక్తులు రెండౌటగాక వర్ణింపఁగ న
వ్యక్తం బని తెలియుట నిజ
భక్తి గదా శివ... 3

క. పరమానందయతీంద్రుఁడ
సురుచిరముగ మిమ్ము వాక్ప్రసూనంబులచేఁ
గరమర్థిఁ బూజచేసెద
పరమాత్మా శివ.... 4

క. ఒకఁడై రెండై మూఁడై
సకలంబై యేమిగాని సహజము బయలై
యకలంకమతికిఁ దోఁచును
ప్రకటముగా శివ ముకుంద పరమానందా! 5

క. తనమహిమ తనకుఁ దెలిసిన
దనయందే తోఁచి యణఁగుఁ దత్త్వములెల్లన్
దనమహిమ తెలియఁ దనకే
పనుపడవలె శివ... 6

క. తనుఁ దాఁ దెలిసెడిమార్గం
బనువుగ సద్గురులవలన నతిసులభంబౌ
తనయుక్తుల శాస్త్రంబుల
బనిగాన దది శివ... 7

క. గురువాక్యము శాస్త్రార్థము
గురుతుగఁ దనయనుభవంబుఁ గుదురుగ నొకటై
మది నిల్చునేని యదిగా
పరమార్థము శివ.... 8

క. మితిమేరలేనిజన్మము
లతికష్టము లనుచు నెంచి యంతటఁ దత్త్వం
బతివిశదముగాఁ దెలియని
బ్రతు కేటికి శివ...



క. అలతత్త్వము గురుకృపచే
నలవడు నని నమ్మి మిగుల నాసక్తుండై
తలపడవలె గురుభజనకుఁ
బలుమారును శివ ముకుంద పరమానందా! 10

క. అల సద్గురుకృప లేకను
తలపడి చదివితి మటంచుఁ దటవటసుద్దుల్
పలుకుచు తిరిగినఁ దెలివికి
ఫల మౌనా శివ.... 11

క. కంటెసఁగఁ గర్మజాలము
లుంటే బంధంబు దీరదో గురుపదముల్
కంటే మోక్షము చేరువ
పంటగదా శివ... 12

క. కొందఱు తత్త్వపుమాటల
సందడిఁ బడి తెలిసినట్లు సద్గురుకృప లే
కుందు రనుభూతిఁ గానని
పందలవలె శివ... 13

క. తాటాకులు ద్రిప్పుచు పది
కోటులు చదువంగ నేమి గురువాక్యంబుల్
పాటించి తెలియ కది యే
ర్పాటౌనా శివ... 14

క. ఒకటై రెండై మూఁడై
సకలంబై యేమిగాని సహజము బయలై
యకలంకమతికిఁ దోఁచును
ప్రకటముగా శివ ముకుంద పరమానందా! 5

క. తనమహిమ తనకుఁ దెలిసిన
దనయందే తోఁచి యణఁగుఁ దత్వములెల్లన్
దనమహిమ తెలియఁ దనకే
పనుపడవలె శివ... 6

క. తనుఁ దాఁ దెలిసెడిమార్గం
బనువుగ సద్గురులవలన నతిసులభంబౌ
తనయుక్తుల శాస్త్రంబుల
బనిగొన దది శివ... 7

క. గురువాక్యము శాస్త్రార్థము
గురుతుగఁ దనయనుభవంబుఁ గుదురుగ నొకటై
మది నిల్చునేని యదిగా
పరమార్థము శివ.... 8

క. మితిమేరలేనిజన్మము
లతికష్టము లనుచు నెంచి యంతటఁ దత్త్వం
బతివిశదముగాఁ దెలియని
బ్రతుకేటికి శివ...



క. అలతత్త్వము గురుకృపచే
నలవడు నని నమ్మి మిగుల నాసక్తుండై
తలపడవలె గురుభజనకుఁ
బలుమారును శివ ముకుంద పరమానందా! 10

క. అల సద్గురుకృప లేకను
తలపడి చదివితి మటంచుఁ దటవటసుద్దుల్
పలుకుచు తిరిగినఁ దెలివికి
ఫల మౌనా శివ.... 11

క. కంటెసఁగఁ గర్మ్మజాలము
లుంటే బంధంబు దీరదో గురుపదముల్
కంటే మోక్షము చేరువ
పంటగదా శివ... 12

క. కొందఱు తత్త్వపుమాటల
సందడిఁ బడి తెలిసినట్లు సద్గురుకృప లే
కుందు రనుభూతిఁ గానని
పందలవలె శివ... 13

క. తాటాకులు ద్రిప్పుచు పది
కోటులు చదువంగ నేమి గురువాక్యంబుల్
పాటించి తెలియ కది యే
ర్పా టౌనా శివ... 14

క. నిజమైనముక్తికొఱకై
సుజనుఁడు సద్గురుని వెదకి సుస్థిరమతి యై
భజియింపక గలదే గతి
ప్రజలకు నిఁక శివ ముకుంద పరమానందా! 15

క. గురుభజనఁ బాపములు చెడు
గురుభజనను గర్మ ముడుగుఁ గోరిక లుడుగుం
గురుభజన ముక్తికర మగు
పరమాత్మా శివ... 16

క. నాటినయామిక విడిచి ప
టాటోపము లేక నమ్రుఁడై గురుభజనం
బాటించక ననుభవ మే
ర్పా టౌనా శివ... 17

క. ఆదట గురుమతమున దే
హాదులఁ దొలఁగంగ నేర్చునాతనిమదిలో
పో దిఁక సహజానందము
పాదుకొనున్ శివ... 18

క. వినినప్పుడె కనవచ్చును
యనుభవి యాయోగివాక్య మాదరమునఁ దా
వినఁగూడనియహమికచేఁ
బనుపడ దది శివ.... 19



క. మాటల వినుకులఁ దగులదు
నూటిగ సద్గురుఁడు చూపఁ జూచినఁ గా కే
ర్పాటును గా దది కుజనులు
పాటింపరు శివ ముకుంద పరమానందా! 20

క. అతిచంచల మై తిరిగెడి
మతి మీఁదయవల్ల నిపుడు మట్టుకు వచ్చున్
గతిచెడి రెక్కలు విఱిగిన
పతగమువలె శివ.... 21

క. ఇలు వెడలి బయలు దేరక
గెలిచే దేలాగు మాయఁ గినియుచు రాఁగా
నిలు సొచ్చి తలుపు మూసిన
బలిమేదీ శివ.... 22

క. బైలుగ మాయాభూతము
హేలాగతి నొప్పఁ గాక యేలా తొలఁగున్
జాల వివేకపుఁజబుకుల
పాలాడక శివ... 23

క. ఏయెడఁ బెద్దలసంగతి
సేయంగా నిత్యసుఖము చేకొనవచ్చున్
మాయాభూతము తొలఁగు ను
పాయం బిది శివ.... 24

క. చాలం గర్మపుఁదొట్లఁ
సోలంగా నుంచి మాయ జోలలు పాడఁ
లాలీయని జీవులనే
బాలుర గని శివ ముకుంద పరమానందా ! 25

క. తానే పరదైవంబని
కానక తనకన్న వేఱు గాఁదలఁచేదే
యూనినమాయారూపము
భానునుతా శివ.... 26

క. తను నే నెఱుఁగనిమునుపే
తనయాటలు చెల్లెఁ గాక తా మా యనఁగా
నను నే నెఱిఁగినపిమ్మట
పనిగలదా శివ... 27

క. అంతా నే నై యుండఁగ
నింతైనఁ మాయ కునికి యెక్కడి దయ్యా
యంతటఁ దొలఁగక నాతోఁ
బంతంబా శివ... 28

క. కట్టిడిమాయ యనంగా
రట్టుకు లోనాయెఁ గాక భ్రమ యిదికాదా
పట్టఁ బనలేని దది యే
పట్టున నిఁక శివ.... 29



క. ఔరౌర మాయ కంటే
యేరీతిని తనగుణంబు లెఱుఁగ రటం చా
నేరమి జీవులపై నిడి
పారెడి నిఁక శివ ముకుంద పరమానందా ! 30

క. నలుదిశల నిక్కడక్కడఁ
దలచూపఁగ లేక మాయ దాగెను కంటే
యలపూర్ణుఁడ నేఁ గాఁగాఁ
బల ముడిగెను శివ... 31

క. కడుదబ్బరలకు నెల్లను
నొడిగట్టిన మాయగుట్టు లోగి నేఁ గనఁగాఁ
బొడచూప వెఱచి తానే
వడిపోయెను శివ... 32

క. ఇది కల్లర ఛీయన్నా!
వదలక యీమాయ కదియవచ్చిన నేమో
ముదిలంజెవలపు చాలును
పదివే లిఁక శివ... 33

క. అవిరళతత్త్వం బెఱిఁగెడు
సువిచారం బొకనిపాలిసొమ్మా మనుజుం
డెవఁడైన నేమి తెలివికి
భవమోచన శివ... 34

క. ఏపాటు లేక తనలోఁ
జూపట్టుచు వెలుఁగుచుండు సూక్ష్మబ్రహ్మం
బేపారఁగఁ దెలియ రహో
పాపాత్ములు శివ ముకుంద పరమానందా! 35

క. శాంతంబై పూర్ణంబై
యెంతయు బ్రహ్మంబు తెలివి కేర్పడ మాయా
క్రాంతముగా మదిఁ దలఁచుట
భ్రాంతిగదా శివ... 36

క. పోషించి తత్త్వరచనల
భాషించినఁ దెలియ లేక పామరమతులై
దూషణ చేతురు కొందఱు
పాషండులు శివ... 37

క. మెండుకొనుతత్త్వవాసన
లుండదు పరిపక్వహృదయు మొగిఁ గాకుంటే
యెండినకసుగా యైనది
పండౌనా శివ... 38

క. పుట్టించనిసుద్దులు చెవిఁ
బెట్టిన వది లెస్సగాక పిమ్మట ధరలోఁ
బుట్టించెడిసుద్దులఁ జెవిఁ
బట్టుదురా శివ... 39



క. వారక సంసారంబునఁ
బోరాడిన నేమి విరతిఁబొందిన నేమీ
యారూఢ యోగి కది వ్యా
పారంబో శివ ముకుంద పరమానందా! 40

క. ఘోరతరకర్మవాసన
శేరీతిని జుట్టి పట్టి హీనులఁ జేయన్
మీఱిన యజ్ఞానుల కది
భారంబో శివ... 41

క. వేదములవలన జనులఁ బ్ర
మోషించి మనీషివరుల మోదము జెరిచే
దూషకులఁ గూడి పెద్దలు
భాషింపరు శివ... 42

క. అచ్చట నచ్చట నేర్చిన
తచ్చన లొక్క కొన్ని యరచి తత్త్వం బని తా
మెచ్చిన నేమగు మాటల
పచ్చళ్లది శివ.... 43

క. అలయంగ భూమి నుదధి
స్థలి కృష్ణనివాసమైన ద్వారక నడుమన్
లలిఁ దను గను శివయోగియె
బలవంతుఁడు శివ.... 44

క. నెల పొద్దులోన గట్టిగ
నెలకొని చూడంగ వలయు నీలజ్యోతిన్
వెలి లోను గానిచూపున
బలిబంధన శివ ముకుంద పరమానందా! 45

క. పరకార్యపరులు లోకులు
పరమజ్ఞానులు స్వకార్యపరులై ధరలో
నిరతిశయసుఖముఁ గాంతురు
పరమాత్మా శివ... 46

క. మేలైన బ్రహ్మవిద్యకు
సూత్రై తగు రాజయోగసుస్థిరు లెచటన్
బూటకపుమంత్రవిద్యలఁ
బాటింపరు శివ.... 47

క. నలుగురి నొక్కటిఁ జేసిన
నలుగురిలో బ్రతుకవచ్చు నాణెముగాఁ దా
నలుగురిపనులకుఁ దిరిగిన
ఫల మంటదు శివ.... 48

క. నలుగురిలోఁ దలవంచుక
నలుగురిలోఁ గూడి మాడి నడువక వేఱై
పలుపోకలఁ దిరుగును ఛీ!
బలహీనుఁడు శివ.... 49



క. నలుగురికిం దా గుఱియై
మెలఁగిన నది ముక్తిగతికి మేలై రాదే
నలుగురితోఁ గూడనిదే
పలుచనయా శివ ముకుంద పరమానందా! 50

క. తనయింటం దా నుండినఁ
దనయిల్లే తనకుఁ జేటు దాఁ దెచ్చు నయా
తనయిల్లు కాలవేసిన
పనిమే లది శివ .. 51

క. అద్దిర యనుభవ మెఱుఁగక
వద్దనువా రెవరు లేక వదరుచుఁ దిరిగే
పెద్దలసుద్దులు గిద్దులు
బద్దలునా శివ.... 52

క. తలఁపు చెడఁ గర్మములు చెడుఁ
దలఁపు చెడన్ మాయ చెడును దా ననుట చెడున్
తలఁపు చెడినతఁడె ముక్తికి
బలవంతుఁడు శివ... 53

క. భావంబుఁ దలఁచు టెల్ల న
భావము తలఁపుడుగు టెల్లఁ బన్నుగ భావా
భావాతీతము సహజము
పావన మది శివ... 54

క. అసమానరాజయోగా
ధ్యానంబునఁ బడమటింటఁ బదిలుం డై తే
దోసఁ గేమిలేనిము క్తికిఁ
బస వట్టిది శివ ముకుంద పరమానందా! 55

క. కలపం డ్రెండు పదాఱును
నలువదిరెండైనచోట నయముగ నొకటై
తెలివొందు వెరసు గూడిన
ఫలసిద్ధా శివ.... 56

క. ఇల బొమ్మరిండ్లలోపల
నలుఁవున మఱి చిన్ని పాప లాడుచు నుండే
సులు వెఱిఁగి యచటఁ దనుఁ గన
ఫలసిద్ధా శివ... 57

క. మీఱిన దుర్వాసనలను
గూరిన మతి నణఁపనేర్చుఁ గుశలుఁడు ధరలో
నారూఢియోగవిద్యా
పారీణుఁడు శివ.... 58

క. లో వెలి చూపులు రెండును
బో విడువఁ దదంతరమున బొలుపగుతత్త్వం
బావిధ మెఱుఁగును నిర్గుణ
భావజ్ఞుఁడు శివ... 59



క. తలఁచినయది జడిమం బగు
తలఁ పుడిగిన శూన్యమగును దలఁచిన తలఁపే
సలలిత మగు చిద్బ్రహ్మము
బలిబంధన శివ ముకుంద పరమానందా! 60

క. కన్నుల ముందఱఁ దెలివై
కన్నది యదికాన్పటంచుఁ గన్న యతండే
పన్నగ నిజవిద్యాసం
పన్నుఁ డగుఁ శివ... 61

క. కను వెలుఁగుననే చూచినఁ
గనవచ్చును జీకటైనఁ గానఁగ వశమా
గను గంటని తనుఁ గనవలెఁ
బనివడి తా శివ... 62

క. లో వెలిఁ జూచిన నొకటే
లో వెలిఁ గాకుండఁ జూడ లోనగు నొకటే
లో వెలిఁ దానై కనుఁబో
భావజ్ఞుఁడు శివ.... 63

క. ఒకటే రెండై తోఁపఁగ
నొకటిని జెప్పంగ వలనె యొకటై యున్నన్
యొకటి నొక టేల నేయను
బ్రకటముగా శివ.... 64

క. తన్నెఱుఁగనిదియు నొకటే
తన్నెఱిఁగినయదియు నొకటె తానన రెండై
యున్నది యొకటే సత్యము
పన్నగ నిఁక శివ ముకుంద పరమానందా! 65

క. మఱచినయదియును నొకటే
మఱపున నెఱిఁగెడిది యొకటె మరువని దొకటే
మఱ పెఱుకగాని దొకటే
పరమాత్మా శివ.... 66

క. చూడఁగఁబడినది యొకటే
వేడుకఁ జూచెడిది యొకటె వీటికి వెలియై
చూడఁగవలసిన దొకటే
పాడి యిదే శివ... 67

క. కానఁగఁబడినది కాన్పును
మానుగఁ గనుఁగొన్నవాఁడు మఱివీటికి లోఁ
గానియతండును దానే
భానునుతా శివ... 68

క. ఇలఁ బసిఁడి లేక యేసొ
మ్ములు గలుగునె తాను లేక మునుకొని జగముల్
పొలుచునె యది తాఁ గాదా
బలిబంధన శివ.... 69



క. జీవునికిఁ గాక దేవుఁడు
దేవునికి న్వేఱె యొక్క దేవుఁడు గలఁడే
దేవుడు తానే యనఁ గను
భావజ్ఞుఁడు శివ ముకుంద పరమానందా! 70

క. మొదటను విత్తే జగమై
యదియే లేనట్టుదాని కగునాధారం
బది దీనియందె నిలుచును
పదిలముగా శివ... 71

క. అతులితసుజ్ఞానముచే
క్షితిలోపల జీవముక్తిఁ జెందకయుంటే
వెతగాదె తాను బ్రతికిన
బ్రతుకెల్లను శివ... 72

క. తనువెత్తఁ జేటు కింకా
తను వెత్తఁగఁ జూతురేమొ తామసులు భువిన్
దనువు చెడి ముక్తి దొరకే
పని బూనరు శివ... 73

క. తలఁపునఁ గలిగినబంధము
తలఁపున నూడంగఁగొట్టి తా మించవలెన్
ములు ముంటఁ బుచ్చువిధమున
బలిబంధన శివ.... 74

క. యాగంబులు మంత్రంబులు
యోగంబులు మగుడజన్మ మొసఁగును నకటా
యోగులకర్మము లుడుగఁగ
బాగాయెను శివ ముకుంద పరమానందా! 75

క. దానంబులు సత్క్రియలును
బూని మఱెన్నైనఁ జేయఁ బుట్టుక చెడునే
దానికి వైరి వివేకము
భానునుతా శివ... 76

క. చేయఁగవలసినపని విధి
నేయుటగా కనుచు నెంచి నేయుచుఁ జేసీ
జేయనియాపని యదియును
బాయురయా శివ.... 77

క. సృష్టికిఁ గలిగినతను విది
నష్టం బని తొలఁగి తన్ను నయముగ నంత
ర్దృష్టిఁ గనలేనిమనుజుఁడు
భ్రష్టుఁ డయా శివ... 78

క. ఊనము జడమును విత్తును
గానిది చైతన్య మెట్లు గానేర్చునయా
తానే దానికి మూలము
భానునుతా శివ... 79



క. తానెఱుఁగనిపని యైనన్
బూనఁగ మది కెట్టు లింపు పుట్టును జెపుమా
దానికి నేరం బే దిఁక
భానునుతా శివ ముకుంద పరమానందా! 80

క. అన్నియుఁ దానై యుండఁగ
నన్నియుఁ దాఁగాక తోఁచె నణఁగక వేఱా
యన్నియుఁ దనలో నైక్యము
పన్నుగ నిఁక శివ.... 81

క. ఎఱిఁగెడి యెఱుకను గొని తా
నెఱుఁగుదుననువాఁడుజడుఁడు యెఱిఁగెడునెఱుకన్
మఱచినయెఱుకే తా నగుఁ
బరమాత్మా! శివ... 82

క. ఒండెఱుఁగక తనుగంటే
పండినకాన్పగుచు సర్వపరిపూర్ణం బై
యుండును నదియే కన్నుల
పండు వయా శివ.... 83

క. యెఱిఁగినయది జడిమంబగు
యెఱుకవిడన్ శూన్య మగును యెఱుకే యెఱుకై
నిరతిశయానందం బగు
పరమాత్మా! శివ... 84

క. కన్నది కన్నట్టే చనె
విన్నది విన్నట్టె యణఁగె వినకే కనకే
యున్నది యేనై యుంటిని
బన్నుగ నిఁక శివ ముకుంద పరమానందా ! 85

క. కన్నది విన్నది గాకే
యున్నది తుదముట్టఁ గంటి నోహో! యిది నే
నెన్నఁడు నెఱుఁగనిదే సం
పన్నత యో శివ... 86

క. మాటల సందెడు నిడఁగను
తాటోటులు గాక దానఁ దత్త్వంబగునే
మాటలతత్త్వము లవి పరి
పాటిగదా! శివ.... 87

క. మేదినిఁ గుజనులు ఘనులతో
వాదింతురు నిజముఁ గన్నవారింబలెనే
యేదైనను దూషణ సం
పాదింతురు శివ.... 88

క. కోటివగవిద్య లెల్లను
కూటికిఁ గా కాత్మవిద్యకును సరియగునే
బూటకము లనక కుజనులు
పాటింపరు శివ.... 89



క. యోగంబందురు కొందఱు
యోగముగా జ్ఞానమందు రొగిఁ గొంద ఱిలన్
యోగజ్ఞానంబులు సమ
భాగంబులు శివ ముకుంద పరమానందా ! 90

క. జ్ఞానం బన యోగం బనఁ
గానఁగవలె నొకటికొకటి కావడికుండల్
పూనిక [1]నొక్కటి నిలువదు
భానునుతా శివ... 91

క. ఏకంటఁ జూడ లేఁడట
యేకంటను జూచుటింక యెఱుఁగుట యేలా
గాకన్నే యాకన్నై
ప్రాకటముగ శివ... 92

క. ఏకనుచూ పాకనుచూ
పేకంబై నిండి నిండి హెచ్చిన సుఖమా
వాకునఁ జెప్పఁగ వశమా
ప్రాకటముగ శివ... 93

క. దృశ్యము కూడిన తెలివి య
వశ్యము బంధంబునుమ్ము వర్ణింపంగా
దృశ్యముఁ బాసిన తెలివి యు
పాస్యం బది శివ... 94

1 యొక్కటి.

క. బంధములగు కర్మంబులు
సంధింపక దృశ్యములను జ్ఞానాగ్నికి దా
నింధనములు సేయఁగవలె
బంధురగతి శివ ముకుంద పరమానందా! 95

క. చెన్నుగ దీపముఁ జూడఁగ
నెన్నఁగ వేఱొక్కదీప మేటికిఁ జెపుమా
తన్నుండే తనుఁ గనవలెఁ
బన్నుగ నీక శివ.... 96

క. అజ్ఞాని యొకఁడు గల్గఁగ
సుజ్ఞానిగఁ జేయవలెను సుజ్ఞానై తే
సుజ్ఞాని నేల చేయును
ప్రాజ్ఞుఁడనా శివ... 97

క. ధరలో విధియు నిషేధము
నెఱుఁగఁడు తద్జ్ఞుండు మింటి కెగిరెడు తురగం
బెఱుఁగునె మిట్టయుఁ బల్లముఁ
బరమాత్మా శివ.... 98

క. దూషణ యసూయకొఱకే
భాషాంతరరచన లెల్ల బ్రతుకులకొఱకే
వేషము వంచనకొఱకే
పాషండము శివ... 99



క. మొందుగ లోకులవలెఁ దా
నుండఁగవలెఁ గూడకున్న నొక్కఁడ మౌనై
యుండఁగవలె నేర్పరియగు
పండితునకు శివ ముకుంద పరమానందా! 100

క. ఇద్దర నయ్యష్టమహా
సిద్ధులు వలె ననుచు భ్రాంతిఁ జెందుదురేమో?
సిద్ధం బగుముక్తికిఁ బ్రతి
బద్ధంబులు శివ.... 101

క. అణిమాదిసిద్ధపురుషులు
గుణవంతులుగాఁగ జనులు కొనియాడుదు రా
గుణహీనులఁ బొగడుదురే
ఫణిశాయీ శివ.... 102

క. ఒకతుచ్ఛసిద్ధిఁ జూపిన
సకలజనుల్ వానిఁ జూచి సన్మానముగా
నకలంకజ్ఞా నందురు
ప్రకటముగా శివ.... 103

క. అణిమాదిసిద్ధు లెల్లను
గణుతింపఁగ మోక్షవిధము గా దెట్లంటే
నణిమాదులు సగుణంబులు
ఫణిశాయీ శివ... 104

క. సిద్ధులు జ్ఞానం బగునా
సిద్ధియు దృశ్యంబు లవియుఁ జేపట్టుదురా
శుద్ధములు గానిసిద్ధు ల
బద్ధంబులు శివ ముకుంద పరమానందా! 105

క. మహిమఁ గనలేరు లోకులు
మహిలో బోధం బపారమహిమ యదె గదా
మహిమవలె నందు రజ్ఞులు
బహుళముగా శివ.... 106

క. ఇహామండలిమంత్రౌషధ
విహితము వివిధులను వివేకములేకే
మహి మని చూతురు మూఢులు
బహుమతిగా శివ.... 107

క. సుజ్ఞాన మహిమ యెవ్వాడు
సుజ్ఞానియె యెఱుఁగనేర్చు సుస్థిరమతి యై
యజ్ఞాని తెలియనేర్చునె
ప్రాజ్ఞునిగతి శివ... 108

క. పరమానందయతీశ్వర
విరచిత మీశతక మిలను విఖ్యాతముగా
కరుణింపు త్రిజగదీశ్వర
పరమాత్మా శివ.... 109



క. పరతత్త్వం బిది శతకము
పరమరహస్యంబు ముక్తిభాజన మిలలో
వరయోగివిలాసం బిది
పరమాత్మా శివ ముకుంద పరమానందా! 110

క. హరి హర గిరిధర పురహర
గరుడధ్వజ నీలకంఠ కనకాంబర శం
కర మాధవ గౌరీధవ
పరమాత్మా శివ ముకుంద పరమానందా! 111

శివ ముకుంద శతకము
సంపూర్ణము.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1922.

# ఆంధ్ర గ్రంథములు.

---

ప్రతి 1-కి రూ. అ.

శ్రీమదాంధ్ర భారతము, పద్య కావ్యము:—

అనేక వ్రాత ప్రతుల సహాయమున చిరకాలమునుండి సంపూర్ణ పరిశ్రమముతో బరిష్కరింపబడినది. మేలుకాగితములపై స్ఫుటముగ అచ్చొత్తించి మంచి కాలికోబైండు చేయఁబడియున్నది. 7 సంపుటముల ప్రతి ... 1-కి 15 12

3 సంపుటముల ప్రతి ... 15 0

ఆది, సభాపర్వములుగల సంపుటము ... 2 8

అరణ్యపర్వము ,, ... 2 4

విరాటోద్యోగపర్వములు ,, ... 2 4

భీష్మద్రోణపర్వములు ,, ... 2 4

కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ... 2 4

శాంతిపర్వము ,, ... 2 1

అనుశాసనిక అశ్వమేధ ఆశ్రమవాస మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణపర్వములుగల సంపుటము 2 4

ఆదిపంచకము, ఒకటేసంపుటము ... 6 8

యుద్ధపంచకము ,, ... 4 4

శాంతిసప్తకము ,, ... 4 4



ఆంధ్రభారతవిమర్శనము, మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారిది ... 0 8

శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము ... 0 12

తెలుఁగుసమస్యలు, చక్కనికూర్పు ... 0 2

భాస్కరరామాయణము, చక్కనికూర్పు, అత్యుత్తమ ప్రతి ... 4 0

కృష్ణరాయవిజయము, కుమార ధూర్జటికృతము 0 8

లంకావిజయము (రావణదమ్మీయము), సటీక, పిండిప్రోలు లక్ష్మణకవికృతము ... 1 4

నిర్వచనోత్తర రామాయణము ... 0 12

ఉత్తర రామాయణము, కంకంటి పాపరాజప్రణీతము, చక్కనికూర్పు, కాలికోబైండు ... 2 4

రంగనాథ రామాయణము, ద్విపద, చక్కనిక్రొత్తకూర్పు 3 8

గోపీనాథ రామాయణము, 2 సంపుటములు, శ్రీమద్రామాయణమునకు సరియైనపద్యము, కవనము మిక్కిలిసొంపు, పీఠిక అతివిపులము ... 5 8

మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరముతో ముద్రితము 0 10

అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి ... 1 4

ఆంధ్ర భాగవతము, పోతనామాత్య ప్రణీతము, ఇదివఱకు ముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగ నున్నది ... 5 0

ప్రభావతీప్రద్యుమ్నము, క్రొత్తకూర్పు ... 0 10

మార్కండేయపురాణము, మారనకృతము ... 1 12

| | | |
|---|---|---|
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, చక్కనికూర్పు... | 3 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, పీఠికవిపులము | 2 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు ... | 2 | 4 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | 3 | 4 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది, క్రొత్తకూర్పు | 1 | 0 |
| హరవిలాసము, శ్రీనాథకవిది ... | 0 | 12 |
| కాశీఖండము, చక్కని క్రొత్తకూర్పు ... | 1 | 8 |
| సారంగధరచరిత్రము, చేమకూర వేంకటకవికృతము | 0 | 8 |
| కవికర్ణరసాయనము, మాంధాతచరిత్ర | 1 | 8 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 0 | 10 |
| విజయవిలాసము, చేమకూర వేంకటకవిది ... | 0 | 8 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి, నారాయణకవిప్రణీతము | 0 | 8 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు, రామభద్రకవికృతము ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము, రుద్రకవికృతము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 4 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవికృతము | 0 | 6 |
| పారిజాతాపహరణము ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము | 0 | 12 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము | 0 | 8 |
| విక్రమార్కచరిత్రము, జక్కనకవిప్రణీతము | 1 | 4 |
| తారాశశాంకవిజయము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| బసవపురాణము, పిడుపర్తి. సోమనాథప్రణీతము | 2 | 4 |



| | | |
|---|---|---|
| హంసవింశతి, నారాయణామాత్యప్రణీతము | 0 | 14 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ గారిది | 1 | 0 |
| రాజయోగసారము, ద్విపద ... | 0 | 4 |
| చెన్నబసవపురాణము, పాపకవికృతము | 1 | 2 |
| పంచతంత్రము, నారాయణ కవికృతము ... | 0 | 12 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక ... | 2 | 8 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు | 1 | 0 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రెగడ, క్రొత్తకూర్పు | 0 | 12 |
| వైశ్యపురాణము ... | 1 | 4 |
| ఉత్తరహరివంశము, నాచనసోమనాథకృతము | 1 | 8 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 10 |
| బిల్హణీయము, చక్కనికూర్పు ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము ,, ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, శుద్ధప్రతి ... | 0 | 8 |
| రసికజనమనోభిరామము ... | 0 | 12 |
| రాజశేఖరవిలాసము ... | 0 | 8 |
| సహస్రకంఠరామాయణము ... | 0 | 14 |
| శ్రీనాథునివీథినాటకము ... | 0 | 2 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము ... | 0 | 12 |
| దసరాపద్యములు ... | 0 | 2 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము... | 0 | 12 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అనంతుని ఛందస్సు, ఛందోదర్పణము ... | 0 | 14 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు ... | 0 | 6 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 0 |
| భాగవతసప్తమస్కంధము, సాధారణప్రతి ... | 0 | 6 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 4 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు... | 0 | 8 |
| భోగినీదండకము, బమ్మెర పోతరాజప్రణీతము | 0 | [illegible] |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) | 0 | 4 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | 0 | 8 |
| అంబరీషోపాఖ్యానము, సటీక, (భాగవతము) | 0 | 4 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు ... | 0 | 8 |
| రూపలి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎనమండ్ర నారాయణమూర్తిగారిది ... | 0 | 8 |
| విదురనీతి, సటీక, ఆంధ్రభారతములోనిది ... | 0 | 5 |
| చాటుపద్యమణిమంజరి, క్రొత్తకూర్పు ... | 1 | 4 |
| నలచరిత్ర, ద్విపద ... | 0 | 14 |
| అరేబియన్‌నైట్సుకథలు ... | 1 | 4 |
| రేచుక్కపగటిచుక్కకథలు ... | 0 | 3 |
| మర్యాదరామన్నకథలు ... | 0 | 2 |
| రోషినార, చరిత్రవిషయకమగు నవల ... | 0 | 14 |
| రాజర్షి, రవీంద్రనాథఠాకూరుగారిబంగాళీనవలకు తెనుగు | 0 | 12 |
| భారతరమణీమణులు ... | 0 | 12 |
| శ్రీమహాభక్తవిజయము ... | 4 | 0 |
| షేక్స్పియర్ నాటకకథలు ... | 1 | 8 |
| పరిహాస్యవినోదకథలు ... | 0 | 12 |
| తారాభాయి, చక్కనినవల ... | 0 | 12 |



| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| దుర్గేశనందిని, నవల ... | 0 | 8 |
| ఈసబునీతికథలు, క్రొత్తకూర్పు 1-వ భాగము | 0 | 6 |
| డిటో 2-వ భాగము | 0 | 8 |
| సీతారామము, తల్లాప్రగడ, సూర్యనారాయణరావుది | 1 | 4 |
| సత్యసేనవిజయము, శ్రీ కో. అనంతాచార్యకృతము | 0 | 4 |
| ఆనందమఠ, నవల ... | 0 | 12 |
| ఐవన్హో, నవల, క్రొత్తకూర్పు ... | 0 | 8 |
| మదాలస ,, ... | 0 | 10 |
| సుజనరంజని ,, ... | 0 | 8 |
| ఉన్మాదిని ,, ... | 0 | 4 |
| రాధారాణి ,, ... | 0 | 4 |
| లీల ,, ... | 0 | 4 |
| భోజునికథలు ... | 0 | 8 |
| విక్రమార్కునికథలు ... | 0 | 8 |
| బేతాళునికథలు ... | 0 | 8 |
| వైద్యులకథలు ... | 0 | 4 |
| తాతాచార్యులకథ ... | 0 | 6 |
| నలుగురుమంత్రులకథ ... | 0 | 4 |
| అయిదుగురుదొంగలకథలు ... | 0 | 6 |
| ఆంధ్రశబ్దమంజరి, శ్రీసీతారామాచార్యకృతము | 0 | 6 |
| వెంకయ్యవ్యాకరణము ... | 0 | 4 |
| బాలవ్యాకరణము, చిన్నయసూరిగారిది ... | 0 | 12 |
| ద్వాదశోపనిషత్తులు, సంస్కృతమునకు సరియైన తెలుఁగు వచనము ... | 8 | 0 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటరంగశాస్త్రికృతము | 6 | 8 |
| డిటో 3 వాల్యములు ... | 7 | 0 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| టిప్పుసుల్తాన్ | ... | 1 | 4 |
| యజుర్వేదకథాసంగ్రహము | ... | 0 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 0 | 12 |
| భారతరమణీమణులు | ... | 0 | 12 |
| శ్రీమహాభక్తవిజయము | ... | 4 | 0 |
| సుశీల | ... | 0 | 8 |
| హితోపదేశము, సులభశైలి | ... | 0 | 12 |
| సంగ్రహరామాయణము, శ్రీశేషాద్రిశర్మకృతము | | 0 | 10 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | | 1 | 4 |
| దశకుమారచరిత్రము, ఎనమచింతల సంజీవరాయశాస్త్రి కృతము | ... | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | ... | 0 | 14 |
| భోజకాళిదాసకథలు, 1-వ భాగము | ... | 0 | 12 |
| దక్కనుపూర్వకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము | | 1 | 8 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 2 |
| తుకారాంచరిత్ర | ... | 0 | 10 |
| శ్రీగురుజాడ, శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | | 3 | 8 |
| మనోహరి, నవల, టి. యస్. రామశాస్త్రిగారిది | | 0 | 14 |
| పరమానంద శిష్యులకథలు | ... | 0 | 3 |
| బాలచంద్రోదయము, (శకటరేఫ నిర్ణయము) | ... | 0 | 8 |
| అధర్వణకారికలు, సటీక | ... | 1 | 0 |
| అద్వైతసంగ్రహము | ... | 0 | 2 |

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

